# జీవన పోరాటం

(కవితా సంపుటి)

అడిగోపుల వెంకటరత్నమ్

ప్రజాశక్తి బుక్ హౌస్
కారల్ మార్క్స్ రోడ్డు
విజయవాడ - 520 002

ఇందులోని కవితలు ప్రజాశక్తి, ఆంధ్రజ్యోతి వారపత్రిక, ఆంధ్రసచిత్ర వారపత్రిక, మయూరి వారపత్రిక, ఐక్య ఉపాధ్యాయ మాసపత్రికలలో ప్రచురించబడ్డాయి. ఆ పత్రికాధిపతులకు నా కృతజ్ఞతలు.

ఈ కవితా సంపుటికి ముందుమాట వ్రాసిన కళాప్రపూర్ణ డా॥ మరుపూరు కోదండరామరెడ్డిగారికి కృతజ్ఞుడను.



రచయిత

---

ప్రతులు : 1000

ముద్రణ : మే, 1986

ముఖ చిత్రం మరియు
లోపలి బొమ్మలు : బాలి

ప్రచురణ :
ప్రోగ్రెసివ్ స్టడీ సర్కిల్
గుంటూరు

వెల : 5-00

కళాప్రపూర్ణ
డా॥ మరుపూరు కోదండరామరెడ్డి

అపర్ణ
జేమ్సుగార్డెన్
నెల్లూరు-524002

---

# మధుర భాషలో అధిక్షేపణ కవిత్వము

సాహిత్యమే వృత్తిగా కలిగిన వ్యక్తి కవిత్వం వ్రాస్తే అంత విశేషం లేదు. కోకిల పాడితే ఆనందమేగాని ఆశ్చర్యం లేదు. కాని కట్టడాలకు తోలిన ఇసుక దిబ్బలలో ఇర్రింకిపోవలసిన ఒక ఇంజనీరు భావస్రవంతి కవితా రూపంలో జాలువాలటం కొనియాడతగిన పనితనం.

ఒక యువక ఇంజనీరు - అడిగోప్పుల వెంకటరత్నమ్ గారు "జీవన పోరాటం"లో మధుర కవియై భావస్ఫూర్తితో అధిక్షేపణ రూపమైనా, మార్గదర్శకమైన కవిత్వం చెప్పి ఇంపు కలిగిస్తున్నారు. భావం విన్నదే అయినా, నూత్న శయ్యా రూపంగా కవితకు తొడవు గూరుస్తున్నది. ఎక్కిరింపుతో దెబ్బతిన్న వ్యక్తిచేతనే నవ్వించే ఈ కవి నేర్పు వేమన వాణితో వియ్యమందుతున్నది. దుస్థితికి అనుతాప బాష్పములే గాని, ద్వేషానలం వెదలగ్రక్కడు. ఈ రచయిత ఆశావాది।

నిష్ఠుర సత్యాన్ని గట్టిగా చెప్పినా భాషలో సారళ్యమున్నది. మాటలు విన్నవే అయినా వాటిని చేర్చడంలో అవి కవితాశిల్ప స్వరూపాన్ని దాలుస్తుంటవి. "మధుర కీర్తి విస్ఫారుడు." "అనాదర మందస్మిత

సుందర వదనారవిందా". "పరిచారికాత్వరేఖ పరిథవిల" అని కవి బ్రహ్మ తిక్కన సోమయాజి చెప్పడాన్ని "సూక్తి వైచిత్రి" అన్నాడు- శ్రీనాథకవి సార్వభౌముడు।

ఈ మనోజ్ఞపక్కీ ఈ ఖండికలలో వెల్లుపటెట్టి ఉన్నది. మువ్వై ఒక్క గీతాలకు ముప్పై ఒక్క చిత్రాలు సంతరించడం, కవి కల్పనా చాతురిని అభిరుచిని చెపుతున్నది.

పాత కొత్తలమధ్య సామరస్య సేతువును నిర్మిస్తున్నాడు - ఈ ఇంజనీరు।

ఇక భావ-భాషా సౌభాగ్యాన్ని కొంత చవిచూద్దాం. కవి కప్పి చెపితే విమర్శకుడు విప్పి చెప్పాల గదా।

(పేజి-9) "ఇంక కొనలేని నేను రక్తం పోసి రాసుందేవాడ్ని" అంటూనే "నీతి గెలుసానని నిరంతరం నా వీపు చరుసోంది" అనగలిగిన ఆశావాది. (పేజి-13) "ప్రజాస్వామ్యం పరుగెత్తికెళ్ళి బుల్లెట్ ప్రూఫ్ అద్దాలగదిలో దాక్కొంది. ప్రజ అనే మాటను నేతిబీరకాయ చేస్తున్నాడు. (పేజి-17) "మన దేశం ప్రాంసరీ నోట్లు రాసి రాసి రెవెన్యూ స్టాంపుల కొరత ఏర్పడింది". మనదేశ సౌభాగ్యం బూటకమని, ఆది భిక్షువు భిక్షా పాత్రకే గౌరవమున్నదంటాడు.

స్వాతంత్ర్యం వచ్చి ఎన్నో ఏండ్లు అయినా అభివృద్ధి లేదని, స్వార్థపరులైన నాయకులను చెనకుతున్నాడు. (పేజి-19) "నిన్నటిరోజు మొన్నటిరోజులాగే వచ్చి, అతన్ని (నాయకుని) ముద్దాడి, నన్ను శపించి వెళ్ళింది." శిథిలతగన్న నిన్నకై, వచ్చియు రాని రేపుకై చింతల వంతల గూరెదేల ? ఎన్ని రేపులీక్షితిపై నిన్నలందుగలసెన్ - అన్న ఒమర్‌ఖయ్యాం బాణిలో పడినాడు.

"ఏ శతాబ్దంలో ఉన్నామో తెలియని వాళ్ళను ఇరవై ఒకటో శతాబ్దంలోకి ఎగరమంటున్నారు" అంటే- ఇప్పటి అభివృద్ధి మేడిపండువంటి

దని రాజకీయవాదుల వీపు బాదుతున్నాడు. "ఇవి వాహ్యాళికొచ్చిన మబ్బులే గాని వర్షించని మేఘాలు" అని భాషతో వికసించిన భావాన్ని వెల్లడిస్తున్నాడు. ఇదే లిరికల్ ఎలిమెంట్ ! (పేజీ_21) కరువును చారుభీషణంగా చిత్రీకరిస్తున్నాడు_ "ఏడు గుర్రాల రథాన్నెక్కి సూర్యుడు వీర విహారం చేస్తున్నాడు" అవును ! ఒక్క గుర్రపు ధాటికే ఆగలేకుంటే, ఏడు గుర్రాల నిష్ఠుర ఖురారావం. "పాలకోసం లేదూడలు ఎండిన తల్లి రొమ్ముల్ని పీల్చి పీల్చి పిప్పి చేస్తుంటే"_ ఇంతకంటే దారుణంగా ఏ ఫోటో గూడా చూపలేదు. అనుకొన్నదానిని చవులూర చెప్పగలిగిన రచన ! (పేజి_25) పుస్తకాలు గాడిద మోతంత, చదువు దూది పింజంత_ అన్న సత్యాన్ని "రెండు ఇసుక తట్టల బరువును నీ ఈడు ఆ పాప ఎలా మోస్తున్నదో చూడు అన్నాడు పుస్తకాలు మోసుకెళ్ళుతున్న కాన్వెంటు పాపను చూపుతూ". ఎంతటి అధిక్షేపణ !

(పేజి _ 27) తళుకు బెళుకు నాగరికత అభివృద్ధి కాదని తిప్పి కొడుతున్నాడు. ఇది ఒక నవ్యరీతి అవహేళన. (పేజీ_33) దక్షిణాఫ్రికా విప్లవకవి బెంజిమన్ మొలోయిజేని ఉరితీసినతాడు "ఆయన ఆలపించిన విప్లవగీతాన్ని పాడుతున్నది". ఇది ఒక ఆత్మబలిదాతకు విశ్వజనీనమైన కవితాంజలి ! చెప్పే విధంలో గదా గుణమేర్పడేది.

(పేజి _ 35) మాఊరు మారింది _ ఎట్లా ? కృత్రిమ ముఖంగా అని ఎగతాళి చేసి, అవినీతి తాండవాన్ని వర్ణిస్తున్నాడు (పేజి _ 37) జీవనోపాధిని మార్చలేని డిగ్రీ పట్టా కాగితాన్ని వానకు తడిసి ముద్ద అవుతున్న తన తొర్రి పూరిగుడిసెలో ఎట్లా కాపాడడం అని, స్నాతకుడైన పట్టభద్రుని తల్లిదండ్రుల ఆవేదనను చెపుతూ, అన్యాపదేశంగా నేటి విద్యా విధానాన్నే పారబట్టు తున్నాడు. (పేజి - 39) భూమి ఆకాశం మధ్య దూరాన్ని నీ చెమట ఆవిరి నింపేసిందని, తన కష్ట ఫలితాన్ని అనుభవించలేని శ్రమజీవిని నిష్కామ యోగి అని చెపుతున్నాడు.

షేక్స్పియర్ – రాస్ప్ పెలవిక్స్ ఉపదేశ వాక్యాలు పలుకుతున్నవి – అన్నట్లున్నది ఇది.

(పేజి – 43) పెళ్ళి నడకన వెండిమబ్బులు – కమ్మటి నుడికారం. (పేజి – 47) గడ్డిపువ్వు ఆకలి తీర్చుకోను తన్ను తొక్కిన పశువును మన్నించి, మనసులేని మనిషి తొక్కిన దానిని కిరాతకృత్యమంటున్నది – సర్వప్రాణి హిత వాక్యం ! (పేజీ – 51) ఎక్కాల బుక్కు మార్కెటులో దొరకనందున, ఆఫీసు ఫైలు ఆరునెలలుగా కదలలేదని ఆఫీసుల పని తనాన్ని బట్టబయలు చేస్తున్నాడు – మంచి వ్యంగ్యోక్తి. (పేజి – 55) పంజరం తన గూడు కాదని పక్షికి తెలుసు – కాని, మానవునికి తన బంధమే తనకు తెలిసినట్లు లేదు – అంటాడు.

(పేజి – 69) క్రిష్ణమ్మ పారింది నల్లని నీరంతా – సుందరయ్యకు నివాపాంజలి – ప్రౌఢ ప్రయోగం. కృష్ణ అంటే నల్లటిది అని. కృష్ణకు కృష్ణాంకం అబ్బినదనుట.

వ్రాతకు ఆనందించి ఇంత వ్రాసినా ! మన్నించండి.

నెల్లూరు
9–5–86

కళాప్రపూర్ణ
డా॥ మరుపూరు కోదండరామరెడ్డి

ప్రొఫెసర్ జి. యన్. రెడ్డి, వైస్-ఛాన్సలర్
శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతి.

# అభినందన

"మానవ జాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అన్నాడు మహాకవి శ్రీశ్రీ.

పరపీడన పరాయణత్వం మానవ స్వార్థ లక్షణం. ఇది దానవత్వం. స్వార్థం మానవుని సహజ లక్షణాల్లో ఒకటి. పరపీడనానికి విభిన్నమైనది పరోపకారం. ఇది త్యాగ లక్షణం. త్యాగం - అహింసలాగ ఒక ఆదర్శ లక్షణమేగాని, సహజ లక్షణం కాదు. అయితే ఆదర్శం మానవత్వ లక్షణం.

స్వార్థం, హింస, పరపీడన, దోపిడి, బలాధిక్యం మొదలైనవి దానవత్వ లక్షణాలు.

త్యాగం, అహింస, పరోపకారం, దానం, సాత్వికత మొదలైనవి మానవత్వానికి లక్షణాలు.

అనాదిగా మానవుల్లోని మానవత్వానికి, దానవత్వానికి మధ్య జరిగిన, జరుగుతున్న పోరాటమే మానవజాతి చరిత్ర.

శ్రీ అడిగోపుల వెంకటరత్నమ్ అందిస్తున్న 'జీవన పోరాటం' మన సమాజంలో గోచరాగోచరంగా వున్న ఆరాటానికి, పోరాటానికి అద్దం పడుతున్న ఒక చిన్న కావ్యం. చక్కిలిగింతలు కాకుండా ఆలోచనా తరంగాల్ని రేకెత్తించే విలక్షణ కావ్యమిది.

సామాజిక స్పృహ కలిగిన కవికి కవితావస్తు దారిద్ర్యం వుండదు. ఎటు చూసినా, ఎవరిని చూసినా, ఎటు తిరిగినా, ఎక్కడ తిరిగినా అన్నీ తనకు స్పందనకారకాలే, చైతన్య జనకాలే. అంతా కవితామయమే. చెట్లూ, వాగులూ, రాళ్ళూ, రప్పలూ కూడా కవిని పలక

రిస్తాయి. కవితో విలపిస్తాయి. ఇందుకు చక్కని నిదర్శనం వెంకటరత్నమ్ గారి "జీవన పోరాటం" లోని కవితా ఖండికలు. ఉదాహరణకు :

"రోడ్డెంబడి
మైలురాయి విలపిస్తోంది
ప్రగతి పథంలో
తన స్థానం లేనందుకు" అంటారు వెంకటరత్నమ్.

కవి మనసుకు బాధకలిగినపుడు అన్యాయాన్ని అరికట్టడంలో నిస్సహాయుడైనపుడు అతనిలో ధర్మాక్రోశం కల్గుతుంది. పలుకు పరుష మౌతుంది. అయితే ఆ పొంగుతగ్గి కొంత శాంతించినపుడు కవి వేదన వ్యంగ్యరూపంగా వ్యక్తం కావచ్చు. వెంకటరత్నమ్‌గారిది ఆవేశంలో కన్నా ఆలోచనలో పుట్టిన కవిత. ధ్వని శిల్పమున్న కవిత. వ్యంగ్యపు చురకల్ని అపుడపుడూ అంటించే కవిత వీరిది.

"రవిగాంచని వన్ని
కవిగాంచి
పాడిన
కవితా ప్రేరణ కవిత"

ఉత్తమ ఆధునికాభ్యుదయ కవుల్లో ఒకరుగా రాణించే కవిహృదయం, ప్రతిభ, రచనా పాటవం వెంకటరత్నమ్‌గారికి ఉండటం అభినందించదగ్గ విషయం. కాబట్టి వారి అభ్యుదయాన్ని ఆశించడం సహృదయ పాఠకుల ధర్మం. అదే నా ధర్మం కూడా.

తిరుపతి,
15_5_86.

ప్రొఫెసర్ జి. యన్. రెడ్డి

---

"అభినందన" వ్రాసిన ప్రొఫెసర్ జి. యన్. రెడ్డిగారికి కృతజ్ఞతలు. — రచయిత

# నిరుద్యోగి

ఇంటర్వ్యూకెళ్తూ
నేనెక్కిన మెట్లన్నీ చెప్తే
ఉద్యోగం వస్తుందని తెలిస్తే
నే నడిచిన దారి పొడవునా వున్న
చెట్లూ చేమల్నిగూడ గుర్తుంచుకొనేవాడ్ని !
ప్రాణమిస్తేనే
నాకు ఉద్యోగం వస్తుందని తెలిస్తే
మా ఇంట్లో ఎవరో ఒకరు
వెంటనే ప్రాణం ఇచ్చుండేవాళ్ళు
అందరి ప్రాణాలు ఆకల్తో
పోగొట్టుకోకుండా !
వ్రాత పరీక్షలో పాసైతే
తప్పక ఉద్యోగం వస్తుందని తెలిస్తే
ఇంకు కొనలేని నేను
రక్తం పోసి రాసుండేవాడ్ని !
నీతి అవినీతి
మల్లయుద్ధంలో
ఎవరు గెలుస్తున్నారో తెలుస్తున్నా ....
నీతి గెలుస్తానని
నిరంతరం నా వీపు చరుస్తూంది.

# నరకాసురులు

నాటి
నరకాసుర సంతతి
నేడు
వందలూ వేలూ లక్షలై
పిగిలి
వీధికో నరకాసురుడై వెలిసి
రాక్షసకృత్యాలతో
రాజ్యమేలుతూవుంటే
ఏ సత్యో
సత్యాపతో
వచ్చి సంహారం చేస్తారనేది భ్రమ!
పీడిత తాడిత ప్రజలంతా
సంఘటిత శక్తయి
ఉప్పెనై
ఈ నరకాసురుల్ని వెంబడించిననాడు
ప్రతిపూట పగలే వెన్నెల
ప్రతిరోజూ వెలుగు జిలుగుల దీపావళే!

# రెండు రెళ్ళు ఆరు

రెండు రెళ్ళు ఆరే
ధారావాహిక నవలల్లో
ప్రేమికులు ఆకలిదప్పులు మాని
ఆకసంలో తిరుగాడుతున్నారు !
రెండు రెళ్ళు ఆరే
పంచరంగుల చిత్రంలో
ఒట్టిచేతుల్తో హీరో
వంద పిస్టళ్ళను ఎదుర్కొంటున్నాడు !
రెండు రెళ్ళు ఆరే
ఈ దేశపు రాజకీయాల్లో
ప్రజాస్వామ్యం పరుగెత్తుకెళ్ళి
బుల్లెట్ ప్రూఫ్ అద్దాలగదిలో దాక్కుంది !
రెండు రెళ్ళు నాలుగు
ప్రపంచపు గణితంలో
సోవియట్ వదిలిన శాంతి కపోతాలు
నాలుగు దిక్కుల్లో ఎగురుతున్నాయి !

# నడుస్తున్న చరిత్ర

కోకిల తన కూతురికి
పాట నేర్పుతూ
పల్లవి తప్పితే
పాడి పాడి వినిపించింది
కూతురు పాట నేర్చుకున్నాక
లయ తప్పిన తన తల్లిని
లయపై పెడుతూ వుంది !
   నువ్వేలాగూ రాయలేవు
   నన్ను రాయనీ
   చెయ్యాల్సిందేదో
   రాసి చూపెడతానంది కలం !

తినేవాడికే తన్నులు
ఈ రోజు నాలుగైతే
రేపు ఎనిమిది
తండ్రి తిన్న దెబ్బలకు
కాపటం పెడ్తూ కొడుకు ఉద్రేకం !
   రెక్కలు తెగి క్రిందపడ్డ
   శాంతి కపోతానికి సర్జరీ చేసి
   ఎగరెయ్యబోతే
   ఎగరనంది
   ఎందుకంటే
   మళ్ళీ రెక్కలు నరకరని
   గ్యారంటీ ఏమిటంది !

# దేశం ఎటు పయనిస్తోంది

మన దేశం ఎటు పయనిస్తోంది ?
ఉషోదయంలో
వరల్డ్ బ్యాంకు దగ్గరకు
సంధ్యా చీకట్లో
ఐ. యం. ఎఫ్. రుణాలవైపు !
ఎన్నో దేశాలకు
మరెన్నో సంస్థలకు
మన దేశం
ప్రాంసరీ నోట్లు రాసి రాసి
రెవెన్యూ స్టాంపుల
కొరత ఏర్పడింది !

# వర్షించని మేఘాలు

అవినీతి ఆకాశం అంటింది
అభివృద్ధి థార్ ఎడారిలో పండుకొంది
స్వాతంత్ర్యం ఎప్పుడొచ్చిందో
చెప్పడం మానేశారు నాయకులు
ఇన్నేళ్ళూ
చేసిందేమిటో చెప్పమని
ప్రజలు నిలదీసి అడుగుతున్నాక !
నిన్నటిరోజు
మొన్నటిరోజులాగే వచ్చి
అతన్ని ముద్దాడి
నన్ను శపించి వెళ్ళింది !
నేటిరోజు
అతనితో గుసగుసలాడుతూ
నా వేపు రుసరుసలాడుతూ చూస్తోంది !
ఇది చూస్తే తెలుస్తూంది
నిన్న నేటి రోజుల వారసత్వంతో
రేపటి రోజు రాబోతూందని !
ఏ శతాబ్దంలో వున్నామో తెలియని వాళ్ళను
ఇరవై ఒకటో శతాబ్దంలోకి ఎగరమంటున్నారు !
ముసిరిన మేఘాల్ని చూసి
ప్రజలు ముంతలు పట్టుక కూర్చున్నారు
అవి
వాహ్యాళి కొచ్చిన మబ్బులేగాని
వర్షించని మేఘాలని తెలియదు పాపం !

# కరువు

ఆంధ్రావనిలో
గత సంవత్సర కరువు కరాళ నృత్యం
ఇంకా ప్రదర్శిస్తూనే వుంది
ఈ సంవత్సర క్షామపీడిత శివతాండవం
దానికి తోడైంది!
ఏడు గుర్రాల రథాన్నెక్కి సూర్యుడు
వీర విహారం చేస్తున్నాడు
మేఘాలెక్కడో దాగి ముచ్చట్లాడుకొంటున్నాయి
తెలుగింటి ఆడపడుచులు కడివెడు నీళ్ళకోసం
ఏడు బావుల వూటను దోర్చుకొంటున్నారు
ఎండిపోయిన పొలాల మధ్య రైతన్నలు కూర్చొని
గుడ్ల నీరు కుక్కుకొంటున్నారు
పిడికెడు గడ్డికోసం పశువులు
మోరెత్తి యజమాన్ని ఆత్రంగా చూస్తున్నాయి
పాలకోసం లేదూడలు ఎండిన తల్లి రొమ్ముల్ని
పీల్చి పీల్చి పిప్పి చేస్తున్నాయి!
ప్రభుత్వం పడకకుర్చీలో పండుకొని
గాఢ నిద్రలో గురక పెడుతూవుంది
నిద్రాభంగం చేసినందుకు ప్రతిపక్షంపై
ప్రభుత్వం విరుచుక పడింది!

# ఉదయించే సూర్యుడు

ఈ శిల్పాలకు వలువలెందుకు
మలచలేదని ఉలి అడిగేసరికి
నేటి నగ్నశిల్పం
శిల్పికి పాఠాలు నేర్పుతూంది !

వేటగాడు విసిరిన వలను
ఒక్క వుదుట్న పక్షులు
లేపుకెళ్ళేసరికి
వల యివ్వమంటూ వేటగాడు
పక్షుల్ని వేడుకొంటున్నాడు !

ఒక్క ముక్కగా వున్న వెండి మబ్బును
వేగంగా వీచిన గాలి
దూది పింజాల్లాగా ఏకేస్తే
మళ్ళీ అన్నీ కలిసి
ఒక్క మబ్బుగా తయారైంది !

ఉదయించే సూర్యుడికెవ్వరూ
ఎదురెళ్ళి
పచ్చ జెండా వూపక్కరలేదు !

# అభివృద్ధి అంచున

పెట్టిన చీరలో
సరిగ ఎంతుందో చెప్పమని
నిలదీసి అడుగుతోంది పెళ్ళికూతురు !

కట్నం తాలూకు నోట్లు
రిజర్వు బ్యాంకే అచ్చేసిందని
హామీ కావాలంటున్నాడు పెళ్ళికొడుకు !

బంగారాన్ని తప్ప మరేమీ
తుయ్యనని మారాం చేస్తోంది
తక్కెట్లో రాయి !

తన దారిన ప్లిమత్ కారు తప్ప
ఇంకేమీ నడవకూడదంటోంది నేషనల్ హైవే !

విమల్ గుడ్డను తప్ప వేరేమీ
కొలవనంటోంది
కొలతబద్ద !

నన్ను
మానాన్ని కప్పుకోడానికి వాడుకోవద్దంటూ
తిరగబడుతోంది దోసిలి !

# మేధావి

నేటి వ్యవస్థ
మేధావికి
రెండుసార్లు
సమాధులు కడుతుంది !
బ్రతికుండగానే
ప్రతిభకు !
చనిపోయాక
శవానికి !
మొదటిది
కాగితంపై
రెండోది
నేలపై !

# ఎగరేసే జెండా

ఎడారిలో ఒయాసిస్సులు
ఎక్కడో వుంటాయి వెతుకు!
నిలుచున్న నీ చోటికి
అవి నడుస్తూ నీకెదురురావు!

పువ్వుల్లో విషం పూసింది చూడు
అన్నెం పున్నెం ఎరుగని
తుమ్మెదలకు
ఆ సంగతి తెలియజేయి!

కార్యానికి
ఫలితం
అపజయం కాకూడదు!

తెల్లని బావుటా చూపి
ఎన్నడూ
తప్పించుకోవద్దు!

ఎగరేసే జెండా
ఎప్పుడూ
ఎఱ్ఱనిదై వుండాలి!

# బెంజిమన్ మొలోయిజే

చీకటి కమ్మిన దక్షిణాఫ్రికాకు
వెలుగును చిమ్మిన ప్రచండ భానుడా
విప్లవ ఖనీ
విప్లవ కవీ
బెంజిమన్ మొలోయిజే
అందుకో! ఇదే మా అరుణాంజలి
ప్రపంచదేశాల నిరసన ప్రక్కకు నెట్టి
ఐక్యరాజ్యసమితి విజ్ఞప్తి త్రోసిపుచ్చి
నీ మెడకు ఉరి బిగించిన బోథా ప్రభుత్వం
ఉరి తాటికి అతి దగ్గర్లోనే నిలబడి వుంది!
నల్లజాతి మనుషులపై
తెల్ల పులుల స్వైర విహారాన్ని అడ్డుకొన్న
నిన్ను
ఉరి తీసిన ఉరితాడు
నువ్వు ఆలపించిన విప్లవ గీతాలు పాడుతూంది!
ఉరితాడుకు
ఎవరు ఉరెయ్యగలరు?
స్వాతంత్ర్య పోరాటం
స్వేచ్ఛావాయువై
వీస్తున్నప్పుడు
ఎవరు దాన్ని బంధించగలరు?

[విప్లవకవి బెంజిమన్ మొలోయిజేను
ఉరితీసిన సందర్భంగా]

# మా ఊరు మారిపోయింది

మా ఊరు మారిపోయింది
ఇరవై ఏళ్ళలో ఎంతగానో మారిపోయింది!
కిరోసిన్ బుడ్ల స్థానే
కరెంటు దీపాలొచ్చాయి
షిఫ్ట్ సిస్టమ్ క్రింద
వారానికో గంట వెలిగి పోతున్నాయి!
హరిజనుల్ని పురజనులు
కాళ్ళతో తన్ని కర్రల్తో కొట్టడం మానేసి
బాంబులు పిస్టళ్ళు పేల్చి చంపుతున్నారు!
కట్నం తేని కోడళ్ళను అత్తమామలు
నస పెట్టడం గొణగడం మానేసి
కిరసనాయిల్తో కాల్చి
కాల్చుకుందంటున్నారు!
మగాళ్ళనే పీడించే సర్పంచి స్థానే
ఆడాళ్ళనే పీడించే ఆయన కుమారుడు
పంచాయితీ ప్రెసిడెంటు పదవి చేబట్టాడు!
చేద బావులు గిలక బావుల స్థానే
ఊరంతా కొళాయిలు వచ్చిపడ్డాయి
ఏ రోజు ఎప్పుడొస్తాయో ఏకాగ్రత్తో చూసి
బిందెత్తుకపోగానే బందై పోతున్నాయి!
పాడి అంతా పాల డిపోకు పోసి
బలహీనమంటూ బస్తీ డాక్టరిచ్చిన
టానిక్కులు కొని తాగుతున్నారు!
మా ఊరు చాల మారిపోయింది
ఇరవై ఏళ్ళలో ఎంతగానో మారిపోయింది!

# డిగ్రీ

నా బరువే పెద్ద భారమై
తల్లిదండ్రులు
ఈదులాడుతూంటే....
యూనివర్సిటీవాళ్ళు
నాకో డిగ్రీ యిచ్చి
వాళ్ళకు
మరో భారం తెచ్చిపెట్టారు
కురుస్తూన్న మా గుడిసెలో
తడవకుండా
డిగ్రీని ఎలా దాచాలాని !

# జీవన పోరాటం

కడుపు నింపుకోను
కూలికోసం ఎదురు చూసేవాడు
ఏ బండనైనా
పిండి చేస్తాడని
యజమాని నమ్మకం !
కొండల్ని కూల్చిన నీకు
కడుపునిండా కూడు దొరికిందేనాడు ?
బండల్ని పిండిచేసి
నువ్వు చేసిన బాటన
నువ్వు నడిచిందేనాడు ?
భూమి ఆకాశం మధ్య దూరాన్ని
నీ చెమట ఆవిరి నింపేసింది
నీ ఆకలి కొలిచేసింది !
దూరాన అన్ని మూలల్లో
నింగి నేలా కలిసి కుట్రపన్నుతున్నాయి
ఒక్కుమ్మడిగా నీపై దాడి చెయ్యడానికి !

# న్యూటన్ లా

చెట్టుకాయ
భూమ్మీద పడ్డందుకు
భూమికి
ఆకర్షణశక్తుందని చెప్పిన న్యూటన్
ఆ కాయ ధర
భూమి నుండి
ఆకాశంలో కెళ్తుందని వూహిస్తే
అంత తొందరగా ఆ సిద్ధాంతాన్ని
ఆయన మనకిచ్చేవాడు కాదేమో !

# నా రాణి

బాధల కెరటాలు
ఉప్పొంగి ఉప్పొంగి
నా గుండెల్ని బ్రద్దలుచేసి
బయట పడాలనే ప్రయత్నం !
చల్లగా నా చరణాల్ని సృజిస్తున్న
చెలియలి కట్టదాటని
ఉప్పొంగిన సముద్రపు కెరటాలు !
ఒడ్డునవున్న పీత ప్రాణ భయంతో
గిజగిజ లాడగా
ఒక్క వుదుట్న తన్నుకుపోయిన పక్షి !
జీవన పోరాటంలో బెస్తవాళ్ళ
విజయగర్వపు ఆగమనం
కార్యసాధనకై పురోగమనం !
సుఖ దుఃఖాల్ని మోసుకవస్తూ పోతూ
దూరాన రైలుబండ్ల కూతలు !
కార్యానికి కాలం నిర్ణయిస్తూ
ఫ్యాక్టరీల సైరన్లు !
నల్లని ఆకాశంక్రింద
పెళ్ళి నడకన వెండిమబ్బులు
మేఘాల మేలి ముసుగులో
నన్నొదిచి వెళ్ళిన నా రాణి !
బాధల కెరటాలు గుండెల్ని బద్దలు చెయ్యకుండా
గుండెల్లో ఇముడ్చుకోవాలనే నా ప్రయత్నం !

# మైలురాయి

రోడ్డెంబడి
మైలురాయి రోదిస్తోంది
బందిపోటు దొంగలకు
బడా దోపిడీదార్లకు
దుష్టులకు దౌర్జన్యకారులకు
తాను కొలమానమైనందుకు !
రోడ్డెంబడి
మైలురాయి విలపిస్తోంది
ప్రగతి పథంలో
తన స్థానం లేనందుకు !

# గడ్డిపువ్వు

పూజా పుష్పం కావాలని
వంకీ జడలోకి ఎక్కాలని
ముచ్చటముడిలో దాగాలని
నేను కోరడంలేదు
అది అత్యాశే !
కాకిపిల్ల కాకికి ముద్దులా
నా తల్లికి నే గారాలబిడ్డను
బంగారు పాపను !
పశువు నన్ను తొక్కిందంటే
దాని పోకడే అంత !
నువ్వు మనిషివి
మనసున్న మనిషివే
నన్ను తొక్కడం
పశుత్వం కాదూ
పరమ కిరాతకంగా లేదూ ?

# నిద్రపోతున్న దేశంలో....

సరస్సులోని చేపపిల్లలు
ఆకాశాన యక్షకన్యలు
నా నేస్తం !
భరతమాత ముద్దుల కుమార్తైను
నిన్న వికసించిన విరజాజిని
యుగాలను అంగల్లో దాటుతున్న
యవ్వన లేడిని
నేడు వాడిన మల్లిని !
నా విషాద గీతాలాపన
నాలో నేను నుస్సై
నిప్పు పొగ కన్పించని జ్వాలావేదన
భారతంలో మహాభారతం !
నీ....నా
జన్మస్థానమైన
నా పుణ్యస్థానంపై
పదిమంది ముష్కరుల దండయాత్ర
రాక్షసుల్ని చిన్నబుచ్చిన
రాక్షసక్రీడ !
ఎవరికి చెప్పుకోను ?
పరిష్కర్తే ప్రథమ ముద్దాయి
దోషిచేతిలోని కలమే
చట్టానికి రూపకల్పన
చట్టానికి సవరణ
శిక్షకు సవరణ
తప్పు తప్పించుకొనేంతవరకు సవరణ !

# కదలని ఫైలు

మూడు మూళ్ళు తొమ్మిదని
రాశాడు గుమాస్తా !
కాదన్నాడు
హెడ్ గుమస్తా !
రెండింటినీ
నిరూపించమన్నాడు
ఆఫీసరు !
ఎక్కాల బుక్కు
మార్కెట్లో దొరకలేదు
అందుకే ఆ ఫైలు
ఆరు నెలలుగా
అక్కడ్నుంచి కదల్లేదు !

# ఒకరికొకరు....

వాళ్ళిద్దరూ తల్లీ కూతుళ్ళు
నడివయస్సు దాటని తల్లి
సందెడు కట్టెలు మోస్తూవుంది !
యుక్తవయస్సురాని కూతురు
బండెడు కట్టెలు మోస్తూవుంది !
అంగలేస్తూ నడుస్తూన్న కూతురు
తల్లికోసం అప్పుడప్పుడూ ఆగుతూంది !
అడుగులో అడుగువేస్తూన్న తల్లి
కూతుర్ని కలుసుకోను ఆరాటపడుతూంది!
సూర్యుడు గూట్లో పడుతున్నాడు
జల్దీగా అమ్మేసి
కలో గెంజో తాగుదాం
పొద్దు పొడిచినప్పట్నుంచి
నువ్వు పచ్చిగంగ ముట్టలేదు
అసలే నీ ఆరోగ్యం అంతంత
అంటూంది కూతురు !
ఎలుగు కొండెక్కితే ఎక్కింది
అడ్డాల బిడ్డవు
సత్తావుంది కదాని చెప్పిన మాటినవు
మొయ్యలేని బరువు నీ మెడబట్టుకొనేను
అంటూంది తల్లి !
ఒకరు ఒకరికి దిక్కూచి
ఒకరు ఒకరికి తల్లి !

# నిజరూపం

పేపరు ప్రకటన్ల కే భయపడి
స్వాతంత్ర్యం ఇచ్చిన దేశాల్లేవు !
నిన్నటి ప్రజల త్యాగ ఫలితం
నేటి పదవని ఆ పదవి మరిచింది
ముప్పై ఏళ్ళు జైల్లోమగ్గి
పదవి చేబట్టిన ఆ నాయకుడు
జైలు గోడలకు
ఇనుప తొడుగులు వేయిస్తున్నాడు
పంజరం
గూడుకాదని
పక్షికి తెలుసు !
చంకలోని పసిబిడ్డ
నడివీధిలో
పైట ఎందుకు లాగాడో
ఆ తల్లిని
ప్రశ్నిస్తోంది ప్రభుత్వం !

# స్వర్ణయుగం

దేశాన్ని రేపు
ఎవరు పాలించాలో
నేటి పాలకులు
నిర్ణయిస్తున్న
సత్తైకాలపు
స్వర్ణయుగమిది !
గాలి గాలానికి
తగులుకొని
ఆకలి వలలో
చిక్కుకొని
నీళ్ళ జల్లెట్లో
నిలబడిపోయి
నేల నాలుగు చెరగులాధర్మం
నాలుగు పాదాల నడుస్తున్న
పుణ్యకాలపు
ధర్మయుగమిది !
రవి గాంచనివన్నీ
కవిగాంచి
పాడిన
కవితాప్రేరణ యిది !

# ఎంతకాలం....

పడుగూ చాలని
పేకా చాలని
పడుగు పేక జీవితం!
మనిషి పతనం నయాగరా
ఉచ్ఛస్థితి హిమాలయం
పాలుతాగే పసిపాప రేపటి ఆశ
కన్నతల్లి నేటి నిరాశ!
ఆకలి తీర్చుకోను
తను అమ్మిన రక్తం
తనకే ఎక్కించాల్సిన దశ!
కుండీలోని పుల్లిస్తరకై
మనిషీ కుక్కల కొట్లాట!
ఎంతకాలమీ
గళంలో హాలాహలం?
మింగడమో
కక్కడమో తేల్చకుండా....

# నా ప్రజలు

కాంతి రాకముందే
క్రమం తప్పకుండా క్యూలో నిలబడ్డం
నా ప్రజల క్రమశిక్షణ
నా జాతికి ఉక్కుశిక్షణ !
పదవిని గెల్చిన ప్రభుత్వం
పదవీ స్వీకారం చెయ్యని స్థితి !
ప్రభుత్వ గోదాముల్లో
తిండిగింజలు నిండుకొని
మిత్రదేశాల నుండి ఆహారధాన్యాల ఓడలు
హిందూ మహాసముద్రం దాటి
బంగాళాఖాతంలో ప్రవేశించిన స్థితి !
పైబడుతున్న వయస్సును పట్టించుకోకుండా
రేషన్‌కోసం చౌకడిపోలవైపు చూస్తున్న స్థితి !
నా ప్రజల గుండెల్లోని కారుమేఘాలు
జల్లులు జల్లులుగా
వర్షిస్తున్న స్థితి !

# విజయ కేతనం

పర్వత శిఖరాలపై
కురిసిన చినుకులు
జారిజారి
రాయినీ రప్పనూ తప్పుకొని
చెట్టునూ తుప్పనూ చుట్టుకొని
సెలయేరై
గెంతుతూ.... త్రుళ్ళుతూ
కొండ అడ్డంరాగానే
ఆగింది.
ఆగిందా.... ?
పెరిగి పెరిగి
పెద్దదై .... పొర్లి
యేరై
అందెల రవళితో
పరవళ్ళు త్రొక్కుతూ
లోయ అడ్డంరాగానే
పడిపోయింది.
పడిపోయిందా.... ?
పొంగి పొంగి.... పొర్లి
నదై
పరుగెత్తుతూంది
సంద్రంలో కలవడానికి !
తన గమనంలో
అనుక్షణం
ఎగరేసిన విజయ కేతనం
మానవ జీవన గమన మార్గదర్శకం !

# పస్తులతో పహరా

వక్రమార్గంలో
చక్రవడ్డీ
వందలు వేలై
మొయ్యలేని అప్పులభారం
నెత్తికెక్కి కూర్చున్న
రైతుకూలీ కుమారుడా
కట్టుబానిస శ్రామికుడా
చుక్కపొడిచాక నిద్రలేచి
సిరిపై
యజమాని ఏటవతల పొలానికి
ఏతంవేసి
చుక్కలు తాకేట్టు
పంటరాసిపోసి
పస్తులతో నువ్వు
పంటకు పహరాకాస్తున్నా....
అదిజమపడని బాకీ
నీ ఖాతాలో
ఎప్పుడూ ఖర్చుపద్దే వుంటుంది
నీ జమా ఖర్చులఖాతా
తిరగబడి నప్పుడు
దాన్ని త్రిప్పడానికి
నువ్వు తిరగబడితే తప్పేముంది ?

# కాగితం పడవ

ఉదయం నుండి ఒకటే వర్షం
ఆకాశం తూట్లు పడినట్లు !
పొయ్యిలో పిల్లి లేవలేదు
లేపమని
లేపలేమని దానికి తెలుసు !
గుడిసెలో ప్రతి అంగుళం కురుస్తోంది
ప్రవాహమై పారుతోంది
కుర్రాడు కాగితం పడవలువదుల్తూ
సంతోషంతో కేరింతలు కొడ్తున్నాడు
పడవలు చెయ్యమని ప్రాణాలు తీస్తున్నాడు
చేసివ్వకపోతే ఆకలంటూ ఏడుస్తున్నాడు
మా జీవితం కాగితం పడవని
అనుక్షణం గుర్తు చేస్తున్నాడు !

# అరుణాంజలి

మండు వేసవిలో
అశేష జన
అశ్రుతర్పణతో
ఎండిన క్రిష్ణమ్మ
నిండుగా పారింది
నల్లని నీరంతా
ఎర్రగా మారింది

(క్రిష్ణానదిలో కామ్రేడ్ సుందరయ్యగారి
అంత్యక్రియలు **చూశాక** )

